తెలుగు వచన కవిత్వంలో దూసుకొస్తున్న నవతరం గొంతుక

"మానవతా కవులు" కవితా సంకలనం

# కర్మ కాదు క్రియ











సంపాదకులు

డా॥ ఎన్.వి.కృష్ణారావు

తెలుగు వచన కవిత్వంలో దూసుకొస్తున్న నవతరం గొంతుక

"మానవతా కవులు" కవితా సంకలనం

# కర్మ కాదు క్రియ

ప్రధాన సంపాదకులు

**డా॥ ఎన్.వి కృష్ణారావు**

**సంపాదక మండలి**

డా॥ పత్తూరి శ్రీనివాసులు

డా॥ జి. వెంకటలాల్

రుద్రపాక జితేంద్రకుమార్

దాసరి రమేష్

కచ్చుళ్ళ బలరామ్

పెనుమాక రాజశేఖర్

పెరుగుపల్లి బలరామ్

వెన్నెల ప్రచురణలు

కర్మ కాదు క్రియ

(వచన కవితా సంకలనం)

సంపాదకులు

డా॥ ఎన్.వి. కృష్ణారావు

వెన్నెల ప్రచురణ

ప్రథమ ముద్రణ

జులై 2018

**వెల : రూ. 20/-**

**ప్రతులకు :**

వెన్నెల ప్రచురణలు

ఇంటి నెంబరు 16-8-178,

3/3, బాలాజీ నగర్,

పాతగుంటూరు, గుంటూరు - 1

ఫోన్ : 94902 18173

**ముద్రణ :**

లక్ష్మీప్రసన్న గ్రాఫిక్స్

గుంటూరు-2, సెల్ : 98660 16690

# విషయసూచిక



# అంకితం

మనిషి నిండుగా
మనసు దండిగా
మాట మెత్తగా
నడత ఆదర్శంగా

చూపు ప్రేమగా
స్పర్శ చల్లగా
నవ్వు దివ్వెగా
పని శ్రద్ధగా

పేరులో బుద్ధి ప్రకాశంగా
పిలుపులో బుద్ధప్రసాదుగా

అభిమానించే ......
ఆదరించే.........
ఆత్మీయులు ........ఎందరెందరో!

మీరు మాత్రం
ఏ మాత్రం అహంకారం లేకుండా
ఎంతో ఒద్దికగా
బౌద్ధం జీవనంగా!

మంచితనానికి మనిషిరూపం
మానవత్వానికి ఆదర్శదీపం
తెలుగు భాషకు వెలుగైన మార్గం
తెలుగు జాతికి చైతన్య నాదం
అందుకే
ఈ మానవతా సంకలనం
ఈ మానవతా మూర్తికే అంకితం!

నిండాలి జగమంతా మానవతాతత్త్వం
అదే
ఈ బౌద్ధవీరుని జీవిత లక్ష్యం
అందుకే ఈ గ్రంథం అంకితం!!



## గ్రంథ స్వీకర్త



మాన్యశ్రీ

**మండలి బుద్ధప్రసాద్ గారు**

ఉపసభాపతి

ఆంధ్రప్రదేశ్ శాసనసభ

అమరావతి



ముఖ్య అతిథి

&

గ్రంథావిష్కర్త



**ఆచార్య విశ్వనాథుని బాలమోహన్‌దాస్‌గారు**

పూర్వ ఉపకులపతి

ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం

గుంటూరు.

## గ్రంథావిష్కరణ సభాధ్యక్షులు

**ఆచార్య ఆదూరి రాజేంద్రప్రసాద్‌గారు**

ఉపకులపతి

ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం

గుంటూరు.



# కృతజ్ఞతలు

ముందుగా, సంవత్సరం నుండి నా మదిలో గిర్రున సుడులు తిరుగుతూ ొట్టుకొంటున్న ఆవేదనలకు, ఆలోచనలకు ఒక రూపం రావడానికి ప్రేరణనిచ్చిన ుపరిచితురాలైన ఒక హోటల్‌లో పని చేస్తున్న ఒక అమ్మాయికి కృతజ్ఞతలు ెలపడం నా కనీస ధర్మంగా భావిస్తున్నా. నా కోరిక 'ఇదీ', ఒక్కడిగా చేయడంకంటే ుమష్టిగా చేస్తే బాగుంటుందని, సాహిత్యానికి, సమాజానికి మనకు తోచిన సేవ ేసినట్లువుతుందని చెప్పిన వెంటనే 'కాదు, కూడదు, కుదరదు' అనే మాటలకు ుమాత్రం అవకాశం ఇవ్వకుండా, నా మీది నమ్మకంతో 'మహాభాగ్యం' అంటూ ాలిసారిగ కలంతో కుస్తీలు పట్టి నా ఆవేదనలకు, వారి ఆలోచనలు చేర్చి ుక్షరరూపమిచ్చిన నా శిష్యమిత్ర బృందానికి ప్రత్యేకించి శుభాక్షరాభినందనలు.

ఈ కవితా సంకలనం వెలువరిస్తున్నాను ఆశీస్సులందించమని ుడిగినప్పుడు ఎంతో సంతోషించి, నన్ను ప్రోత్సహించి 'చారిత్రకావసరం - ఈ పుస్తకం' అని చారిత్రక సత్యాన్ని అక్షరీకరించిన పెద్దలు, గౌరవనీయులు ుచార్య నాగార్జున విశ్వవిద్యాలయ ఉపకులపతులు ఆచార్య ఎ. రాజేంద్రప్రసాద్ ారికి,

'అన్నగారూ! ముందుమాట' అనగానే పనుల ఒత్తిడిలో కూడా పుస్తకమంతా ుదివి, ఇది 'మానవతాపతాక'మని ఎగురవేసి, ఎలుగెత్తిచాటిన అన్నయ్య, ుంధ్రప్రదేశ్ నాటక అకాడమీ ఉపాధ్యక్షులు డా॥ కందిమళ్ల సాంబశివరావుగారికి ్పృదయపూర్వక కృతజ్ఞతా నమస్కారాలు.

మంచి మనసుతో ఈ గ్రంథాన్ని స్వీకరించడానికి అంగీకరించిన మానవతామూర్తి, ఆంధ్రప్రదేశ్ శాసనసభ ఉపసభాపతి, మాన్యశ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారి సౌమనస్యానికి ఎన్నెన్ని దండాలో!

అడిగిన వెంటనే అత్యవసర పనులు ఎన్ని వున్నా ఈ పుస్తకావిష్కరణకు నేనొస్తానని మాట ఇచ్చి, ముఖ్యఅతిథిగా వచ్చి గ్రంథావిష్కరణ చేసిన పూజ్యులు నాకు శ్రేయోభిలాషులు, సుమనస్కులు, మానవతావాదులు, ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయ పూర్వ ఉపకులపతులు ఆచార్య వి. బాలమోహన్‌దాస్‌గారికి వినమ్ర ప్రణామాలు.

నాకు గురువులు, గురుతుల్యులు, ఆత్మీయులు, శ్రేయోభిలాషులు ఆచార్య ఎస్. గంగప్ప, డా॥ వెన్నిసెట్టి సింగారావు, డా॥ నాగభైరవ ఆదినారాయణ, డా॥ గుమ్మా సాంబశివరావు, డా॥ పోతురాజు శ్రీనివాసరావు గార్లకు వినయపూర్వక కృతజ్ఞతలు.

అభిమాన అన్నయ్య శ్రీ బండి అశోక్‌రెడ్డిగారికి, ప్రియమిత్రుడు శ్రీ చెట్టి సుబ్రహ్మణ్యం గారికి ఆత్మీయ కృతజ్ఞతలు.

డి.టి.పి. చేసి అందంగా అచ్చొత్తించిన మిత్రుడు శ్రీ పల్లె వెంకటేశ్వర్లు (లక్ష్మీప్రసన్న గ్రాఫిక్స్) గారికి అభినందనలు.

నమస్సులతో

ఎన్.వి. కృష్ణారావు



# “చారిత్రకావసరం - ఈ పుస్తకం”

ఆచార్య ఎ. రాజేంద్రప్రసాద్
ఉపకులపతి
ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం
గుంటూరు

ప్రస్తుత పరిస్థితుల్లో ఈ కవితా సంకలనం వెలువడటం సామాజికావసరమే కాదు, చారిత్రకావసరం కూడా. సమాజంలో ఎటుచూసినా ఆశ, స్వార్థం, మోసం, ...థం మొదలైన ఆలోచనలతో 'అసలు నాకేంటి?' అనే మనస్తత్వాలు అధికంగా కనిపిస్తున్నాయి, కానీ మానవత్వమనే ఆలోచన మనిషి మస్తిష్కంలో వున్నట్లుగా కనబడటం లేదు. పసిపాపలు, యువతులపై దారుణ అత్యాచారాలు, ఆస్తులు తీసుకొని తల్లిదండ్రులను నిర్దాక్షిణ్యంగా రోడ్లపై నిలబెట్టడం, అన్నదమ్ముల ఆస్తుల గొడవలు, హత్యలు, మానవతా విలువలపై నీలినీడలు, తోటివారిపై 'సాటిమనిషి' అనే కనీస కనికరమైనా చూపని సందర్భాలు... ఇలా ఎన్నెన్నో అమానవీయ దృశ్యాలు నేటి వార్తలలో చూస్తూనే వున్నాం. ఇది సమాజానికి మంచి పరిణామం కాదు కదా !

సైన్స్‌తో సమాజం ఎంతో అభివృద్ధిని సాధించింది. అయితే ఇది శాస్త్ర, సాంకేతిక పరంగానే వృద్ధి చెందిందా అనిపిస్తుంది. ఎందుకంటే మానసికంగా, మానవతాపరంగా సమాజం ఇంకా ఎదగాల్సిన అవసరం ఉంది. బాగా చదువుకొని, మంచి ఉద్యోగాలు చేస్తున్న యువతరం ఆత్మన్యూనతతో, అత్యాశతో, భార్యాభర్తలు పరస్పరావగాహనా లోపంతో లేక ఇంకేదో పొందలేకపోతున్నామనే నిరుత్సాహంతో, మానవత్వాన్ని మరచి దారుణచర్యలకు దిగజారుతుంటే సమాజం ఎటు వెళుతుంది? మనిషిని మనిషిగా ప్రేమించక పోయినా కనీసం సాటి మనిషన్న భావనతోనైనా ప్రవర్తించండి. మానవత్వాన్ని బ్రతికించండి అంటూ ఆశపడుతూ

సందేశమిస్తూ ఎనిమిదిమంది కవులు **'మానవతా కవులు'** గా ఏర్పడి ఈ కవి
సంకలనాన్ని తీసుకురావడం ఎంతో హర్షించదగ్గది, ముందు తరాల
స్ఫూర్తిదాయకమైనది, ఆదర్శవంతమైనది.

తెలుగు సాహిత్యంలో భావకవిత్వం మొదలుకొని ఎన్నెన్నో సాహి
వుద్యమాలు, వాదాలు వచ్చాయి. కానీ **'మానవతాతత్త్వం'**తో వస్తున్న మొట్టమొద
గ్రంథంగా దీనిని భావిస్తున్నా. మన రాష్ట్ర రాజధానిలో అన్ని రంగాలలో నూ
ఆవిష్కరణలు జరిగి అందరికి ఆదర్శంగా నిలవాలనుకొంటున్న సందర్భం
తెలుగు సాహితీరంగంలో కూడా ఒక నూతన ఆవిష్కరణకు నాందిగా
ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయంలోని తెలుగు విభాగం కూడ నిలవ
విశ్వవిద్యాలయానికి గర్వకారణంగా పేర్కొంటున్నాను.

తనతోపాటు ఏడుగురు కొత్త కవులను తయారుచేసి గురుతర బాధ్యతల
నిర్వహిస్తూనే ఎంతో ప్రయాసపడి ఈ పుస్తకాన్ని ఈ విధంగా తీసుకొస్తున్న ప్రధా
సంపాదకుడు డా॥ ఎన్.వి.కృష్ణారావును అభినందిస్తూ, మిగిలిన యువకవులంద
ఆశీర్వదిస్తూ......

**ఆచార్య ఎ. రాజేంద్రప్రసాద్**





# మానవతా పతాక

డాక్టర్ కందిమళ్ళ సాంబశివరావు
ఉపాధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్ నాటక అకాడమీ
అమరావతి.

మానవత్వం... అది మనిషి తత్త్వం... సామాజిక జీవనాన్ని కొనసాగించే మనిషి తాను ఎంత భద్రంగా... సౌకర్యవంతంగా... స్వేచ్ఛగా... వ్యక్తిగత గౌరవానికి భంగం కలగకుండా జీవించాలని కోరుకుంటాడో అటువంటి పరిస్థితులే ప్రతిమనిషి జీవితంలో ఉండాలనీ... ఉంటాయనీ విశ్వసిస్తూ అదే పంథాలో ప్రవర్తించడమే మానవత్వం... సహజంగా ఈ మానవత్వం అనే మాటను వినగానే కరుణాత్మకంగా అనిపిస్తూ ఉంటుంది. పరిమిత పరిధిలో దయాగుణాన్ని, ప్రేమాస్పదమైన ప్రవర్తననూ ఈ మాటకు వర్తిస్తూ ఉంటారు. కానీ మానవత్వం అనే పదం యొక్క నిర్వచనం చాలా చాలా విస్తృతమైనది. శాస్త్రీయ దృక్పథంతో ఆ ప్రక్రియలోని భాగస్వామిగా ఉండడాన్ని ఎంతగా కోరుకుంటాడో అదే మాదిరి స్వేచ్ఛ తన చుట్టూ ఉన్న మనుషులకు ఉన్నదని గుర్తిస్తూ వారి వారి హక్కులు అంటే మానవ హక్కులను నిరంతరం కాపాడుకోవడమే మానవత్వం. వ్యక్తి స్వేచ్ఛ శిఖరాయమానమైన లక్ష్యంగా భావించే సమాజమే మానవత్వపు పరిమళాలను వెదజల్లుతున్నట్లు భావించగల సమాజం. మనిషి తనను తాను ప్రేమించుకొన్నట్లుగానే సర్వమానవాళి పట్ల ప్రవర్తించగల తత్త్వమే మానవత్వపు మధురిమ. సృష్ట్యాది నుండి మానవుడు తన జీవన గమనంలో ఎదుర్కొన్న అనేక సవాళ్లను అధిగమిస్తూ... కష్టాలను ఎదురీదుతూ ఈనాటికి మానవ సమాజాన్ని ఈ స్థితికి చేర్చాడు. అది ఆదిమ మానవుని నుండి ఆధునిక మానవుని వరకూ మనిషితత్త్వంలో నిగూఢమైన జీవనకాంక్ష. దీనిని పరమోత్కృష్టమైన భావనగా

పరిగణిస్తూ సకల జీవజాలం పట్ల, ఇతర జీవజాలాలు... భూమి... ప్రకృతి మీద ప్రదర్శిస్తున్న బాధ్యతా రాహిత్యాన్ని సహించలేని మానవతావాద గొంతుకలు... మాయమైపోతున్న మనిషితనం పట్ల ఆందోళన వ్యక్తపరుస్తూ సమసమాజ నిర్మాణపు పునాదులైన మానవత్వ విలువలను పునఃప్రతిష్ఠించాలని తమ శాయశక్తులా కృషి చేస్తూ ఉన్నాయి. ఈ మానవతావాద ఉద్యమానికి చేయీ చేయీ కలిపి ప్రతి మానవుడూ దానిని బలపరచాలని అందరి ఆశ, ఆకాంక్ష.

"నేను" అన్నది అహం... భేషజం, స్వార్థం అనే రాళ్ళతో దుర్భేద్యంగా కట్టుకొన్న పటిష్ఠమైన గోడ. ఆ వలయంలో నేను బాగుండాలి... నేను ఎదగాలి... అనే భావనలతో బలిసిపోతాం. మనం అంటే ఆ గోడల్ని బద్దలు కొట్టి అనంతానంత భావనతో అక్కున చేర్చుకొనే విశాలత్వం... అదే విశాలతత్త్వం కూడ. నేను బాగుండాలి అనుకొంటే అందులో స్వార్థమున్నా తప్పుకాదు. కానీ నేను మాత్రమే బాగుండాలి అనుకోవడంతోనే జరగాల్సిన అనర్థం జరిగిపోతుంది. అందుకే ఓ కవి అన్నట్లు నువ్వూ నేనూ కలిస్తే మనం... మనం మనం కలిస్తే జనం... అనే మాటను జీవసూత్రంగా తీసుకొంటే... నీ మూలంగా పక్కవాడి కళ్లల్లో నీటిచెమ్మను గుర్తించి తడి మనస్సుతో తుడిస్తే అదే మానవత. అది స్థిరీకరించబడితే మానవీయత.

ఆధునిక తెలుగు కవితా ప్రస్థానంలో ఎన్నో మలుపులు...ఎన్నెన్నో మజిలీలు...ఎన్నో చేతనలు... మరెన్నో విప్లవ కేతనాలు. దిగంబర కవులు... పైగంబర కవులు... చేతనావర్త కవులు... అంతకుముందు నయాగరా కవులు. మదిమడిలో సుడులు తిరుగుతున్న భావ వీచికలను బలీయంగా వ్యక్తం చేస్తూ తమ గొంతుకలను విప్పారు. ఆ కోవలో నవ... యువ చేతనతో ఓ ఎనిమిది మంది ఆవిరైపోతున్న మనిషితనాన్ని తమ రెండు చేతులూ అడ్డుపెట్టి కాపు కాయడానికి అడుగు వేస్తున్నారు. తమ అంతరంగ తరంగాలను... ఆలోచనాలోచనాలను అక్షర గవాక్షాలను తెరచి దోసిళ్ళతో పంచి పెట్టడానికి ఉవ్విళ్ళూరుతున్నారు. మంచిని రెండు చేతులతో ఆహ్వానించడం - అభినందించడం... ఆశీర్వదించడం... మనం చేయాలి... చేద్దాం.

డాక్టర్ ఎన్.వి. కృష్ణారావు నాకు తమ్ముడు లాంటి వాడు. అన్నగారూ అని పిలుస్తాడు. కేవలం పిలుపులోనే కాదు చేతల్లోకూడా అలాగే ఉంటాడు. నాకు చాలా ఇష్టుడు. పరిశోధన సమయంలో నాటకం వైపుకు లాగాను. నా అంచనాలకు మించి అద్భుతమైన పరిశోధన చేశాడు. అప్పుడప్పుడూ జావగారుతూ... జారిపోతూ ఉంటే చిన్నపాటి మందలింపులతో దారికి తెచ్చే పెద్దరికాన్నీ పుచ్చుకొంటాను. ఇప్పుడు కృష్ణారావు, ఆయన మిత్రులు, అంతే వాసులూ వ్రాసిన గేయాలను అచ్చొత్తించే ప్రయత్నం చేస్తున్నాడు. అభినందనీయం.

కృష్ణారావుతో పాటు డా॥ పత్తూరి శ్రీనివాసులు, డా॥ జి. వెంకటలాల్, రుద్రపాక జితేంద్రకుమార్, దాసరి రమేష్, కచ్చళ్ళ బలరామ్, పెనుమాక రాజశేఖర్, పెరుగుపల్లి బలరామ్‌లు పెనవేసుకొని **'మానవతా కవులు'** అని నామకరణం చేసుకొన్నారు. ఆ పేరు పెట్టుకొన్నందుకు నిజంగా అర్హులే. ఎందుకంటే వీరి కవితల్లో కల్పనలు, భావనల కన్నా గుండె లోతుల్లో నుండి పెల్లుబికిన అనుభూతులు, స్వీయ స్పందనలే ఎక్కువగా ఉన్నాయి. ఇందులో ఆర్ద్రత ఉంది... ఆక్రోశం ఉంది...ఆవేదన ఉంది... ఆవేశం ఉంది.. అన్నింటి కలగలుపులో జవం, జీవం ఉంది. అస్తవ్యస్తగమన మదకరీంద్రంపై విసిరిన విచ్చుకత్తులూ ఉన్నాయి. క్షుభితాశ్రుకల్లోల నీరధులను ఆవిరి చేసే దిశానిర్దేశాలు ఉన్నాయి. మానవతా కేతనాలను ఎగురవేయడానికి ఎంచుకొన్న గేయప్రక్రియలో మరింత పరిపూర్ణత సాధించాలి. చెప్పదలచుకొన్న విషయాన్ని మరింత సూటిగా, ఘాటుగా చెప్పడానికి నిరంతర సాధన చేయాలి. ఈ మానవతా ప్రబోధ దీపకళికలు అఖండంగా వెలగాలనీ, మరెన్నో గుండె చప్పుళ్ళను తమ కవితల్లో ప్రతిధ్వనించాలని ఆశిస్తూ! ఆకాంక్షిస్తూ...!



# ముందుమాట కాదు ఉన్నమాటే!

తెలుగు నేలకు ప్రణామాలు
తెలుగు జాతికి నమస్సులు
తెలుగు తల్లికి వందనాలు
తెలుగు సరస్వతికి అభివందనాలు

తెలుగు నేలపై ఎందరో మహనీయులు జన్మించి అనేక రంగాల్లో విశేష ప్రజ్ఞను చూపి ముందు తరాలకు మార్గదర్శకులయ్యారు. ఆ మహనీయ మూర్తులకు, వారి మార్గదర్శకత్వానికి వినయంగా శిరసు వంచి అంజలి ఘటిస్తున్నాం. మాది సాహిత్యరంగం గనుక తెలుగు సాహితీ లోకంలో ఎందరికో మార్గదర్శకులైన సాహితీమూర్తులకు అక్షరాభిషేకాలు.

ప్రారంభం నుండి తెలుగు సాహితీయజ్ఞం అనేక ప్రక్రియలతో నిర్విఘ్నంగా ప్రజ్వరిల్లుతూనే వుంది. ఎందరో సృజనకారులు ఋత్విక్కులుగా మారి ఆ యజ్ఞానికి అక్షర సమిధల నర్పించి ఆ యజ్ఞకాంతులను దశదిశలా వ్యాపింప జేశారు. నన్నయకు ముందుతరం వారి నుండి మొదలుకొని నారాయణరెడ్డి తరం అనంతరు వరకు కూడా ఈ సాహితీ యజ్ఞ కాంతులు ప్రసరించాయి. ప్రభావితులను చేశాయి. అలా ప్రభవించిన వారు ఒక్కొక్కరు ఒక్కొక్క యజ్ఞకర్తలై ఒక్కొక్క రీతిగా సృజన క్రతువును కొనసాగించారు. సాగిస్తూ వున్నారు.

ముఖ్యంగా ఆ సాహితీయజ్ఞాగ్నిశిఖల నుండి ఉద్భవించింది అనూహ్యమైన వచన కవిత్వం. ఈ కవిత్వానికి..

"అవధులు లేవు
అభివ్యక్తి వుంటే చాలు
నిబంధనలు లేవు
కవినని నమ్మిక కలిగితే చాలు
స్వర కల్పన అవసరం లేదు
అక్షరాల కూర్పుంటే చాలు

అలంకారాల శోభ లేదు
నిజాయితీ వుంటే చాలు
గణ విభజన వుండక్కర్లేదు
గుణం కుదిరితే చాలు
అందరికీ అర్థమయ్యేది
అందరినీ వికసింప జేసేది" -

ఇటువంటి వచన కవిత్వాన్ని ఆశ్రయించుకొని ఎనిమిది మంది సమకాలీన కవులు వెలువరిస్తున్న **మానవతా కవితా సంపుటి** ఇది. భావకవిత్వం మొదలుకొని నేటి అస్తిత్వవాద కవితా వ్యక్తీకరణల వరకు ఆయా కవులు, ఆయా సమాజాల్లో, ఆయా సందర్భాల్లో పరిశీలించిన ప్రభావితమైన, అనుభవంలోకి వచ్చిన అనేకాంశాలను కవిత్వీకరించి వారి వారి ఆలోచనా దృక్పథాలను ప్రకటించారు. ఇదేకోవలో ఈనాటి సమాజానికి అవసరమైన, మౌలికమైన **'మానవత్వం'** అనే అంశాన్ని ప్రధాన జెండా, అజెండాగా స్వీకరించి సమకాలీన తెలుగు సాహిత్య చరిత్రలో కొత్త కోణానికి నాంది పలుకుతూ వస్తున్న మానవతా కవిత్వమిది.

మానవత్వం అనేది ఒక వాదం కాదు. అది ఒక తత్త్వం. జీవి పుట్టినప్పటి నుండి చనిపోయేంత వరకు ఆ జీవిలో అణుఅణువులో అంతర్గతంగా వుండి ఆయా సందర్భాలను బట్టి బయటకు ప్రదర్శితమవుతుంది. **ఒక సందర్భానికో, సన్నివేశానికో, సంఘటనకో మనిషి కళ్ళల్లో కొద్దిగానైనా 'తడి' కనబడిందంటే ఆ మనిషి స్పందించినట్లే. ఆ స్పందనకు కారణం - ఆ మనిషిలో వున్న మానవతా తత్త్వగుణమే కాని మరొకటి కాదని గుర్తించాలి.**

వాదమనేది ఒక వ్యక్తికో, సంస్థకో, వ్యవస్థకో మాత్రమే పరిమితమైనదిగా పరిగణించవచ్చు. కొంతకాలం వాదం ఉద్ధృతంగా ప్రచారం పొందవచ్చు. మరికొంతకాలం ఆ ఉద్ధృతిని కొనసాగించలేక పోవచ్చు. సామాజిక పరిస్థితులను బట్టి వాదాల మనుగడ ఆధారపడి వుంటుంది. కానీ తత్త్వం అటువంటిది కాదు. ఒక ప్రాణి స్వభావమే దాని తత్త్వం. **మనిషి అనే ప్రాణి యొక్క అసలు తత్త్వం మానవత్వమే కావాలి. ఆ మానవత్వంతోనే మనిషి మనీషిగా, మహామనిషిగా,**

మహోన్నతుడిగా, మహర్షిగా, దైవత్వం మూర్తీభవించిన వ్యక్తిగా క్రమవికాసం పొందటం జరుగుతుంది. ప్రపంచ చరిత్రలు అవే తెలియజేస్తున్నాయి.

"మానవత్వం అంటే సాటి మనిషి కూడ తనలాగే బ్రతకాలని ఆశించటం, చేయూత నందించటమే గదా! ఆ తత్త్వం మనిషి మరచిననాడు మనిషి తత్త్వం మానవత్వమేనని మరలా గుర్తు చేయాల్సిన అవసరం, బాధ్యత సమాజానికుంది. సమాజంలో భాగస్వాములు, ఆ భావనను కలిగించి, దృష్టిని మరలా ఆ అంశంపై నిలిపే ప్రయత్నం చేసే వారిలో కవులు ముందుంటారు గనుక ఈ సమకాలీన కవులు ఆ ప్రయత్నం చేస్తున్నారు. ప్రస్తుత పరిస్థితుల్లో సమాజానికి అన్నీ దొరుకుతున్నాయి గాని మానవత్వం దొరకడం లేదు. కనబడటం లేదనేది అందరు గుర్తించిందే. మరచిపోయిన మానవత్వాన్ని మరలా మనుషుల్లోకి వ్యాప్తి చేయాలని మానవతా సంకల్పంతో చేస్తున్న ప్రయత్నమిది.

మనుషులందరిలోకి మానవత్వం తిరిగి రావాలని, సమాజం అంతట సోదరభావం లేకపోయినా సాటి మనిషన్న భావనతో, సానుకూల వాతావరణంలో సామరస్యంగా సహజీవనం కొనసాగించాలని కోరుకుంటూ ఈ ఎనిమిది మంది కవులు తమ కలల్ని, ఆశల్ని కలాల ద్వారా వ్యక్తం చేస్తున్నారు. వీరంతా గొప్ప కవులు కాదు. ఏ మాత్రం పేరు ప్రతిష్ఠలు లేవు. గొప్ప గొప్ప కవితా సంపుటాలు వెలువరించలేదు. కానీ మానవత్వం అనే తత్త్వాన్ని ఆత్మగా చేసుకొని ఆవిష్కరిస్తున్న కవితా సంపుటి ఇది. చిన్న, చిన్న లోపాలు, దోషాలు ఏవైనా వుంటే పెద్దలు, పాఠకులు, పండితులు, కవులు, కవితాభిమానులు సహృదయతతో మన్నించి తెలియజేసి ఆశీర్వదించాలని ఆశిస్తూ...

వినమ్రతతో

**సంపాదక మండలి**

# శాంతి ! అహింస !! మానవత్వం !!!

శాంతి ఉత్తమమైనది
అహింస ఉదాత్తమైనది
మానవత్వం మహోన్నతమైనది

శాంతి సహనం పెంపొందిస్తుంది
అహింస ఆత్మానందాన్నిస్తుంది
మానవత్వం మరో జీవితాన్నిస్తుంది

శాంతికి చిరునామా - సహజీవనం
అహింసకు అడ్రస్ - అంతులేని ప్రేమ, త్యాగం
మానవత్వం నిర్వచనం - బ్రతుకు, బ్రతికించు

ఇంతకు మించి జీవిత లక్ష్యం లేదు
ఇంతకు మించి జీవిత పరమార్థం లేదు
ఇంతకు మించి జీవిత సత్యం లేదు
ఇంతకు మించి గొప్ప దైవస్తుతి లేదు

'సెక్స్ రోబోను సృష్టించింది మానవ మేథస్సు*
'మానవత్వం' మాట మరచింది మనిషి మనస్సు'
సైన్స్ గొప్పదో !
సెన్స్ గొప్పదో !
'సెన్స్ లేని సైన్స్ నాన్సెన్స్
సెన్స్‌తోటి సైన్స్ ఎక్స్‌లెన్స్'

---

* బార్సిలోనాకు చెందిన సెర్గి శాంతోస్ సెక్స్ రోబోను తయారు చేశాడు. 21/12/2017 ఈనాడు దినపత్రికలో "రోబాబులు" అనే వార్తలో ప్రచురితం.

ప్రకృతి అందమైంది
ప్రపంచం అద్భుతమైంది
విజ్ఞానం వింతైంది
ధనం అభీష్టవర ప్రదాయిని ! (ఈరోజుల్లో)
అన్నీ బాగున్నాయ్ -
కానీ......
అనుభవించాలంటే ..........?
ఏం ఉండాలి?

మనిషుండాలి
మనుషులుండాలి
సమాజముండాలి

మనుషుల్లేని నేల
మరుభూమికన్నా హీనం కాదా ?
మనిషే దేవుడు
మానవత్వమే దైవత్వం.

డా॥ ఎన్.వి. కృష్ణారావ
94902 18173



# కర్మ కాదు క్రియ

ఇప్పుడు కావాల్సింది
కర్మ కాదు క్రియ

ఇప్పుడు చెప్పాల్సింటది
కర్మ కాదు క్రియ

ఇప్పుడు నేర్పాల్సింది
కర్మ కాదు క్రియ

ఇప్పుడు ఆలోచించాల్సింది
కర్మ కాదు క్రియ

ఇప్పుడు చర్చించాల్సింది
కర్మ కాదు క్రియ

ఇప్పుడే కాదు ఎప్పుడూ అవసరమైంది
కర్మ కాదు క్రియ

**కర్మ - పూర్వజన్మలో చేసిన పాపపుణ్యాల చిట్టా ।**
**క్రియ - ప్రస్తుత సమాజానికి నువు చేయాల్సిన చిట్టా ॥**

కర్మ సిద్ధాంతం నమ్మకు
సొంత సిద్ధాంతం అమ్మకు
మంచి సిద్ధాంతం పెంచుకో
క్రియే సిద్ధాంతం చాటు భో !

ఒడి లేక బడిలేక
దడిలేక మడిలేక

పనిలేని గని లేని
జనలేని మనలేని

బతుకు భయం - పరువు భయం
మగత భయం - మగువ భయం
మనసు భయం - మరణ భయం
కనిపించని దైవభయం

కర్మ నీ గతం
కర్మ ఇక హతం
క్రియే నీ గమ్యం
క్రియే ఇక భవ్యం

మారలేదు అమ్మ మనసు
మారలేదు అమ్మతనం
మారలేదు పాలదనం
మారతుంది నేటితరం

చెప్పుకొంటే - చేతుల్లో
చెప్పుకుంటే - మనసుల్లో

దాచింది ధర్మమా !
పంచింది ధర్మమా !

దాచేది నాలుగు తరాలకైతే
పంచేది నలభై తరాలు చాటుతుంది

దానవత్వాన్ని తుంచు
మానవత్వాన్ని పంచు
ఏది పండుతుందో !
ఏది ఫలితమిస్తుందో !
ఏది సాటి మనిషికి బ్రతుకునిస్తుందో !

సాక్ష్యం నీవు కాదు
వీక్షకుడివి మాత్రమే !
కాలభ్రమణమే నిర్ణేత
మానవత్వమే - మహాసౌధ!

డా॥ ఎన్.వి. కృష్ణారావు
94902 18173



## రాయైనా! రప్పైనా!

ఆ ఊహకే! అమ్మో!
తల్లి ఒళ్ళు గడగడ వణుకుతోంది
తల్లి గుండె దడదడ కొట్టుకుంటోంది
చూపుకు చైతన్యం లేదు
నోటికి మాటలు రావడం లేదు
మనసుకు స్పందనలూ లేవు

అయినా -
మౌనంగా ఉండలేకపోతోంది

శాంతిని చంపి
అహింసను అణచి
మానవతను పూడ్చి
ఏం సాధిస్తారు?
నీళ్ళమీద నడుస్తారా!
గాలిలో ఎగురుతారా!

ఆకాశంలో ఆడుకొంటారా!
నిప్పుతో స్నానం చేస్తారా!
మట్టిలో చెరిగిపోని ముద్రలేస్తారా!
ఎన్ని చేసినా -

చూడటానికి 'ఒక్క మనిషి' వుండాలిగా!
చెప్పడానికి 'ఒక్క సాక్ష్యం' మిగలాలిగా!

మనిషి లేని
సాక్ష్యం మిగలని
ఈ చరిత్ర ఎవడిక్కావాలి ?
ఏం సాధించబడిందని
డప్పులేసి చాటాలి ?

తల్లి కళ్ళు తడిశాయి
పిల్ల కళ్ళు తెరిచింది
గుండెల్లో ఘోష
గొంతులో దూరింది

లోకం మారిపోయింది
శోకం భారమైంది
నవ్వుకు విలువే పోయింది
ఏడ్పు అంతకన్నా లోకువైంది
కంటి చుక్కలు ఉబకటం లేదు
ఇంకిన వాటికే దిక్కు లేదుగా !
అయినా –
మౌనంగా ఉండలేకపోతోంది !

పేపర్‌లో
టి.వి.లో
వాట్సప్‌లో
ఫేస్‌బుక్‌లో
యూట్యూబ్‌లో

ఒకటేమిటి -
కనిపించే దృశ్యాలలో
వినిపించే వార్తలలో
వామ్మో !
ఒళ్ళు జలదరిస్తోంది !

అరేళ్ళ చిన్నారి మర్మావయువాల్లో చెక్కముక్కలు*
ఒక సం॥ పసిపాపపై మానవమృగం పైశాచికత్వం*
భర్తను చంపి ఆ స్థానంలో ప్రియుడ్ని ఉంచిన భార్య
పెళ్ళైన రోజునే భార్యకు నరకం చూపించిన భర్త
కొడుకును చంపిన తల్లి
తల్లిని నరికిన కొడుకు
ఆస్తి లాక్కొని తల్లిని గెంటేసిన కూతురు
ఆస్తి పంచలేదని 80 ఏళ్ళ తండ్రిని చావబాదిన కొడుకు[illegible]

తరుగుతున్న ప్రేమలు
పెరుగుతున్న ఆశ్రమాలు
తెగుతున్న బంధాలు
తెంపుతున్న పరిస్థితులు
కాలానికి గ్రహణం పట్టిందా ?
మనిషికే గ్రహింపు పోతుందా ?
మనిషి - ఈ గ్రహానికి దూరమవుతున్నాడా ?

ప్రశ్నలు లోయల్లా !
సమాధానాలు శూన్యంలా !
అయినా -
మౌనంగా ఉండలేకపోతోంది.

★★ 11/12/2017 ఆంధ్రజ్యోతి దినపత్రికలో 'రేప్ టెర్రర్' అనే వార్తలో ప్రచురితం.

ప్రేమ వంచింపబడుతోంది
ప్రకృతి సంహరించబడుతోంది
దైవత్వం దూషించబడుతోంది
మానవత్వం పరిహసించబడుతోంది

మనుషుల్లారా !
నేలమీద నిలబడండి
ప్రకృతిని పరిశీలించండి

ప్రేమ గొప్పదా ! పగ గొప్పదా
శాంతి సుఖమా ! అశాంతి సుఖమా !
అహింస ఆనందమా ! హింస ఆనందమా !
మానవత్వం మహనీయమా ! అమానవీయతే
అలంకారమా !

తల్లి కదిలింది
కళ్ళు తెలిసింది
మళ్లీ ఊహలు
అమ్మో !
ఒళ్ళు గగుర్పొడుస్తోంది

తెలివి తెచ్చుకొని తల్లి
పొత్తిళ్ళలో పొదవికొంటూ
జన్మనెత్తినందుకు
జన్మనిచ్చినందుకు
'జన్మ జన్మల పాపమా' ఇదని నిందించుకొంటూ

ఊహల్ని విసిరేసినా
ఎగిరెగురుకుంటూ మరలా ఆవహించాయి
కాలం చక్రం గదా !
మనసు ఆగదు గదా !

ఆ ఊహాలు
ఎన్ని రకాలో.....
ఎన్ని కోణాలో.....
ఎన్ని వంపులో.....
ఎన్ని సందర్భాలో.....

శాంతి
అహింస
మానవత
కనిపించని లోకంలో
కలవరపాటే మదిలో

ఆ తల్లీపిల్లలు
ఎన్నిటికి ప్రతీకలో !
పక్షైనా - పశువైనా
మనిషైనా - చెట్టైనా
చివరకు -
రాయైనా - రప్పైనా !

డా॥ ఎన్.వి. కృష్ణారా
94902 181

# ఓసారి ప్రశ్నించుకోండి!

మనిషికి కావల్సిందేంటి ?

మనిషిని కావాలనుకునే వాడికి
కావాల్సిందేంటి ?
మనిషి మనీషిగా మారాలనుకున్నప్పుడు
కావాల్సిందేంటి ?

యుగయుగాల మతమౌఢ్యపు మత్తొకవైపు
తరతరాల ధనదాహం మరో వైపు
తిరిగి తిరిగి తలలెత్తే విషనాగులై
అందర్నీ కాటేస్తుంటే

నైతికత
మానవత
సభ్యత
సంస్కృతి
నేర్పాల్సిన విద్య
కార్పొరేట్ కౌగిలింతల్లో వెచ్చదనాన్ని పొందుతుంటే
బడాబాబులకి గులాములను తయారు చేస్తుంటే

సాఫ్ట్‌వేర్లతో, రియలెస్టేటర్లతో పోల్చుకొంటూ
జాతిని నడపాల్సిన గురువులు లఘువులౌతుంటే
ప్రాణాంతక వ్యాధుల నుండి రక్షించాల్సిన వైద్యులే
ప్రాణాలను హరిస్తుంటే

జాతికి దన్నుగ నిలవాల్సిన నాయకులు
రకరకాల మాయలతో స్వార్థాన్ని కావలించుకుంటే
మనిషికి కావాల్సిందేమిటి ?
ఆలోచించండి ఒక్కసారి
ప్రశ్నించుకోండి మరొక్కసారి !

మనిషిని
మనీషిగా నిలబెట్టే
మానవత్వం !

అందుకే
మనిషి మరిచిన
మానవత్వాన్ని చాటుదాం
తిరిగి మనిషిలో
దాన్ని నాటుదాం !

– డా॥ పత్తూరి శ్రీనివాసులు
9494682690



# ఇక్కడ మనుషులుండాలి

ఇది భూలోకం
మానవలోకం
ఎనభై లక్షల జీవుల
జవజీవాలతో
నిండిన లోకం

తోటి జంతువులు, పక్షులతో కలిసి
తిరుగుతూ, ఎగురుతూ, దూకుతూ
గంతులు వేస్తూ, తుళ్ళింతలతో కేరింతలతో
మనుషులు సంచరించిన లోకం
అపుడు వారిలో
మానవత్వం
దయ
ప్రేమ
కరుణ
జాలి ఉన్నాయ్
ఇది ఒకనాటి మాట !

★★

ఇప్పుడు
ఈ లోకంలో
వర్ణాలున్నాయ్
కులాలున్నాయ్
ఉద్యోగాలున్నాయ్

ఆధార్ కార్డులున్నాయ్
వాటి నెంబర్లున్నాయ్
కానీ,
ఇక్కడ మనుషుండాలి
వారేరి ?

**

ఇప్పుడు
ఈ లోకంలో
సెల్‌ఫోన్లున్నాయ్
వాటి టవర్లున్నాయ్
రేడియో తరంగాలున్నాయ్
వాటి నిండా
విజ్ఞానమో
అజ్ఞానమో
అశ్లీలమో
నిరంతరం
ప్రవహిస్తూనే వున్నాయ్
కానీ, ఇక్కడ
పిచ్చుకలుండాలి
కాకులుండాలి
చిలుకలుండాలి
గోరింకలుండాలి
వాటితో కూడిన
వేకువజాములుండాలి

**

ఈ లోకంలో
కార్పొరేట్
ఎయిడెడ్
అన్‌ఎయిడెడ్
ప్రభుత్వ
ప్రైవేటు
స్కూళ్లున్నాయ్
కాలేజీలున్నాయ్
వాటిలో ఫీజులున్నాయ్
ఆత్మహత్యలూ ఉన్నాయ్
కానీ, ఇక్కడ
గురుకులాలుండాలి
గురువులుండాలి
శిష్యులుండాలి
గురుశిష్య సంబంధాలుండాలి
అవేవి ?

★★

ఇప్పుడు
ఈ లోకంలో
రౌడీలున్నారు
గుండాలు, దాదాలున్నారు
మాఫియా, స్మగ్లింగ్ ముఠాలున్నాయ్
వాటి ఆలనాపాలనా చూసేవారున్నారు
కానీ, ఇక్కడ

డొక్కా సీతమ్మలు
బుద్దా వెంగళరెడ్లు
ఆర్డర్ కాటన్లు
విశ్వేశ్వరయ్యలు
కందుకూరి, గురజాడలుండాలి
వారేరి ?

మనుషులు మరణించారా ?
మనసుకు ముసుగేశారా ?
మనుషులు పుడుతున్నారు
మానవత్వం మాత్రం చచ్చిపోతుంది
అభివృద్ధి అంటే
మానవకల్యాణం జరగడం
మారణహోమం ఆగడం

ఏది కావాలో కోరుకో
ఏది విడవాలో తెలుసుకో !!

- డా॥ పత్తూరి శ్రీనివాస

949468269



## ..... చిరంజీవిగా...... జీవించు .....!

ఎందరో మహాత్ములు ...... !

ఎన్నో ...... ఎన్నెన్నో.....

మహోన్నత లక్ష్యసాధనా మార్గాలు......

అనాదిగ...... ఆదినుండి ......

సంస్కృతి సంప్రదాయ సువర్ణలతలపై......

అవతరించిన మహాత్ములు......

మంగళమూర్తులనే......

దివ్యసుమపరిమళాల సందేశం ......

నా భారతదేశం.....

ఈ గడ్డపై ......

అణువణువు సందేశమే ......!!!

ప్రవహించే నీరు...... ఎలా బ్రతకాలో చెబుతుంది

ధర్మమంటే అదే కదా !

వీచేగాలి ...... బ్రతికి ఏం సాధించాలో ...... నేర్పుతుంది......

జ్ఞానమంటే ...... సాధనే కదా ......!

ధర్మచింతనతో ......

జ్ఞానవంతమైన జీవన లతకు ......

నిజమైన అలంకారం ......

ఉన్నతమైన హృదయక్రాంతి......

ఆ దివ్యక్రాంతి ...... ఆధ్యాత్మిక లోతుల్లో ...... "అద్వైతం"......

భౌతిక జగతిలో ...... ఆ దివ్యక్రాంతి......

పరిపూర్ణ మానవ చైతన్య ప్రస్థానంలో ......

అఖండమై వెలిగే "శాంతి"...... !!!

లే ...... భారతీయుడా ...... మేలుకో...... !

సహృదయ భావ సరళిపై ...... విశాల విశ్వాన్ని.....

శాంతి పతాకమై సంధించు ......!!!

అందరి నడుమ...... చిరకాలం ...... చిరంజీవిగా ...... జీవించు ......!!

- రుద్రపాక జితేంద్రకుమార్

78937 89981

# ...... మౌనంగా...... వెతుకుతున్నావా......!

ఎన్నో సమస్యల సుడులు హృదయాన !
అగాథాల అంతుచిక్కని బడబాగ్ని ముడులు !

కుదురుగా వుండనీక
కకావికలం చేస్తుంటే
నిండైన రూపాన్ని
నింపాదిగ చెరిపేస్తూ
వెక్కిరింతల నవ్వులా
వెలితిపడే కెరటాలు !

యుగయుగాల
కాలచక్రపు మాయాజాలం
నిన్ను పలకరించనిదే వెళుతుందా !

నాడు కాయమంతా చీల్చినా
అమృతాన్ని అమ్మలా దేవతలకు పంచావు !
అనంత జీవజాల గతికై ఔషధాల దేవుడినే అందించావు!
సిరుల తల్లిని ఇంపుగా దరిజేర్చి విశ్వపోషణ చేశావు!

మరి నేడు
హృదయాన్ని పొరలు పొరలుగా తరుగుతున్నా
పొట్టకూటి జీవుల నిధి నిక్షేపాల వేటలో
పూటపూటల బ్రతుకు పోరాటపు ఆటలో
ఉక్కుపాశాల నలిగిపోతూ

పసికందుకు స్తన్యమిచ్చే తల్లిలా

అసమాన మానవత్వపు ఖనివై

ఖనిజధారలందిస్తూ

మీరింకా నేర్చుకోరా అంటూ ప్రశ్నిస్తూ కదులుతున్నావు

అమ్మా సాగరమా !

భావిప్రగతిన బాసటై

మానవత్వపు నిర్వచనాల ప్రమిద పై

అనంత జ్యోతివై వెలుగుతున్నావు !

మాలో మౌనంగా......

మానవత్వాన్ని వెతుకుతున్నావు......!!!

- రుద్రపాక జితేంద్రకుమా[r]

7893789981



# నాకిక్కడ చోటు లేదు

నిన్నటి వరకు నేనున్నాననుకున్నాను
కానీ లేను
ఈ విశాల ప్రపంచంలో
అందరూ నన్ను ఇష్టపడుతున్నారనుకున్నాను
కానీ కాదు

అంతా భ్రమ
నిత్యం మాటల యుద్ధాలతో
హద్దు వివాదాలతో
రాతలు చెరిపి
కయ్యానికి సై అనే లోకంలో
నాకు చోటు లేదని తెలిసింది

నా పేరు వచించిన మూర్తులను
కాలగర్భంలో కలిపేశారు
శాంతి కాంక్షించిన బుద్ధునికి
విషమిచ్చి చంపిన లోకం
శాంతి కాంక్షించిన క్రీస్తుని
సిలువ వేసి శిక్షించిన లోకం
శాంతి కాంక్షించిన గాంధీని
తూట్లు చేసిన లోకం

నా పేరు పలికితేనే భరించలేని లోకం
నాకు రూపముంటే భరిస్తుందా ?
రూపముంటే
సమస్త ప్రాణులను జీర్ణించుకునే

మానవాసురులకు
ఏనాడో జీర్ణమయ్యేదాన్ని
అందుకే నన్ను
అనంత తిమిరపుటంచులకు
కృష్ణబిలాల కేంద్రంలోకి తరిమేశారు
నాకిక్కడ చోటు లేదు

శాంతి కోసమంటూ
ఆయుధాలతో
అంబులి నింపుకొనే దేశాల్లారా
చంపిన వీరుల నెత్తురు
ప్రశ్నిస్తుంది నువ్వెక్కడని ?
అందుకే నాకు చోటులేదు
నాదంతా భ్రమ

అన్నదమ్ముల గొడవ
ఇరుగుపొరుగు గొడవ
దేశదేశానికి గొడవ
ఇక నాకు చోటేది

నాదంతా భ్రమ
నేను లేనన్నది నిజం
కోపంతో కన్నెర్ర జేసే
సూర్యుడు సాక్షి
ఏమీ చేయలేని
చంద్రుడు సాక్షి
నాకిక్కడ చోటు లేదు

- దాసరి రమే
99518545

# కళ్ళు తెలిస్తేనే......!

ఒకడిపై ఒకడు కత్తులు దూసుకొని
గెలుపు తేలదనుకున్నప్పుడో
గెలుపు చేజారుతుందనుకున్నప్పుడో
ఎత్తే తెల్లజెండానా

ప్రతిరోజూ ఒకరినొకరు
మాటలతో రోతగా రచ్చకీడ్చుకుంటూ
నలుగురూ కలిసినప్పుడు
నాలుగు చేతులు కపటంగా కలిపి
శ్వేతకపోతాన్ని సింబాలిగ్గా ఎగరేయటమా?
ప్రతిక్షణం ప్రజల్ని హింసకు పురిగొల్పి
అశాంతి బడబాగ్నిని గుండెల్లో రగిల్చి
వర్తమానాన్ని రక్తసిక్తం గావిస్తూ
ఇదిగో శాంతి రాట్నం అంటూ ఫోజులివ్వటమా ?
కాదు......

శాంతంటే
తెల్లజెండానో
శ్వేతకపోతమో
రాట్నం వడకటమో కాదు..... ముమ్మాటికీ కాదు

నిర్మలాకార వినీల గగనంలో స్వేచ్ఛగా ఎగిరే ఆత్మ
పుడమి గర్భంలోనే పుట్టి
విశ్వాంతరాళంలో పరివ్యాపితమై
వెలుగు ప్రసరించే ప్రభాత కాంతి

విచ్చుకున్న భూమిని
ఆప్యాయంగా హత్తుకొనే తొలకరి
గ్రీష్మం హేమంతమైతే పొందే పులకింత

అందుకే
శాంతికి పర్యాయపదం శాంతే
భ్రాంతిలో బతుకుతుంది మనమే
కళ్ళు తెరిస్తేనే
శాంతి గోచరిస్తుంది.

- దాసరి రమే
99518 5457



# మరచిందేదీ!

మా నవత మరిచింది
మానవత్వపు విలువలను
ఆధునికత మోజులో
వేగవంతమైన జీవితపు ఝురిలో
మనిషే మనిషినన్న విషయం మర్చిపోయాడు

మొద్దుబారిన మనసులు
యంత్ర శరీరులు
జీవనమే యాంత్రికమైన వేళ
విలువలు యంత్రంలో నలిగిపోయాయి

బంధాలు
బంధుత్వాలు
ప్రేమనురాగాలు
పక్కనబెట్టి
యాంత్రికంగా బ్రతుకునీదుస్తున్న
మా నవతరం మరిచింది
మనుషులమన్న సంగతి !

వృద్ధులను పలకరించే సమయం లేదు
అనాథలను ఆదరించే ఆలోచన రాదు
ప్రమాదంలో ఉన్నవారిని
కనీసం కన్నెత్తి చూడని
మా నవతరం మరిచింది
మనుషులమన్న సంగతి !

అన్నం పెట్టే రైతుల ఆత్మహత్యలు
పేపర్లో కాలమ్‌లకు పరిమితం
విద్యార్థుల ఆత్మహత్యలు
టి.వి.ల టి.ఆర్.పి.లకు పరిమితం

చలించటం
స్పందించటం
ప్రశ్నించటం
పురోగమించటం
యాంత్రిక జీవనంలో
మా నవత మరిచింది
మనుషులమన్న సంగతి !

చదివిన చదువుకి
చేసే పనికి
పొంతన లేని జీవన సరళితో
భారంగా బ్రతుకునీడుస్తూ
ఉద్యోగాల వేటలో
చెమట చిందిస్తున్న
నేటి యువత
మా నవత మరిచింది
మనుషులమన్న సంగతి !

- దాసరి రమే
99518 5457

# నేను రాను

నేటి ప్రపంచం

నేను కాను

నేను లేను

నేను రాను

..... మనిషిగ మారేవరకూ.....

జాతులు

మతాలు

దేశాలు

నేను కాను

నేను లేను

నేను రాను......

....ఎల్లలు తొలిగే వరకూ....

నాది నాదే

నీది నీదే

అంతా ఎందరిది?

నేను కాను

నేను లేను

నేను రాను

....అందరిదీ అనుకొనేంత వరకూ....

విద్యా విచ్ఛితి

ప్రాణ భక్షతి

సమాజ దుస్థితి

నేను కాను

నేను లేను

నేను రాను

....విద్య మనిషి దరి చేరే వరకూ....

మాతృత్వం మృగ్యమాయె

భ్రాతృత్వం పారిపోయె

ఔదార్యం ఓడిపోయె

నేను కాను

నేను లేను

నేను రాను

....మనిషిని మనిషని గుర్తించేవరకూ....

- కచ్చుళ్ళ బలరామ్

97052 50027



# సారాంశం

పాల కులం

రాజ మతం

తెలుపు కులం

నలుపు మతం

అధిక కులం

అల్ప మతం

రాయి రప్పా

కుక్క నక్కా

అన్నింటికీ

రంగులు పులమబడ్డాయి

అసలు రంగును అణచిపెట్టాయి.

కావ్ - కావ్

మ్యావ్ - మ్యావ్

భౌ - భౌ

ప్రకృతి ధర్మాల ముందు

ఏది మతం ? ఏది కులం ?

పంచభూతాల పరమార్థమే - మానవత్వం !

ఆకలిదే కులం ? ఆయువుదే మతం ?
ధర్మానిదే కులం ? న్యాయానిదే మతం ?
నీతికి కులమతాలెక్కడ ?

మానవత్వమే మనుష్య కులం
మానవత్వమే మనుష్య మతం
మానవత్వమే -
సకల మత సారాంశం !
అదే కావాలి
అందరికీ జీవనసారం !

- కచ్చుళ్ళ బలరామ్
97052 50027



# కావాలి నా లోకం !

నా లోకం

మానవ లోకం

మనసున్న మనుష్యుల లోకం

కనబడదేదీ !

దాహం ! అడిగి మరీ తీర్చే లోకం

ఆపదలను సృష్టించని లోకం

ఆదుకొనే లోకం

అభయహస్తాలు చూపించే లోకం

కష్టాలను ఆప్యాయతలతో తరిమేసే లోకం

కలిసి ఆదుకున్న లోకం

కలిసి ఆకలి తీర్చుకున్న లోకం

కలిసి బ్రతకటమే తెలిసిన లోకం

సమతే సౌభాగ్యంగా గల లోకం,

అందరూ బావుండాలనే లోకం

బాగును పంచే లోకం, పెంచే లోకం

అవసరం గుర్తించిన లోకం

ఇవ్వటంలో ఆనందం పొందే లోకం

హింసను సహించని లోకం

శాంతిని కాంక్షించే లోకం

సకల కళలకు వేదికైన లోకం,

సకల విజ్ఞానాలు విరిసిన ఆనంద సాక్షాత్కార లోకం,

సకల శాస్త్రాల సారాంశం మానవత్వంగా కలిగిన లోకం,

మనిషిని దైవంగా కొలిచిన లోకం

మా మంచి లోకం

మానవత్వ లోకం

నేడు కనబడదే !

కావాలి ఆ లోకం నాకు

కనిపిస్తుందా నా కోరిక తీరే వరకూ.....

- కచ్చుళ్ళ బలరాం

97052 50027



# కావలసింది.....!

పుట్టే ప్రాణికి తెలియదు
తాను ఎప్పుడు గిట్టుతుందో..... ?
పూసే పూవుకు తెలియదు
తాను ఎప్పుడు రాలుతుందో..... ?
వీచే గాలికి తెలియదు
తాను ఎందరికి ఊపిరినిస్తుందో..... ?
పారే నీటికి తెలియదు
తాను ఎందరికి దాహం తీరుస్తుందో..... ?

కానీ -
పుట్టిన మానవుడికి తెలుసు
తాను మనిషినని !
తనతో జీవించేవారు
తోటి మనుషులని !

ఆ మనిషి
మహామనిషిగా మారాలంటే
మరొకరికి ఆదర్శం కావాలంటే
జీవితం సాఫీగా సాగాలంటే
తోటివారు భద్రంగా జీవించాలంటే....

పెద్ద పెద్ద సాహసకార్యాలు వద్దు
మనసుతో, చేతలతో
చిన్న, చిన్నవి చేస్తే చాలు !

పగను చంపాలి - ప్రేమను పంచాలి
అసూయను అణచాలి - ఆప్యాయతను అందించాలి
గర్వాన్ని బంధించాలి - గౌరవాన్ని కలిగించాలి
అపకారం వీడాలి - ఉపకారం చేయాలి
ధనాపేక్ష చావాలి - ప్రేమాపేక్ష పుట్టాలి
అన్యోన్యంగా మెలగాలి - ప్రేమజ్యోతులు వెలగాలి
మనిషిగా కావసిందిదే !

అదే జీవితానికి అసలు అర్థం
అదే జీవన్ముక్తికి మార్గం
అదే మనిషి తత్వం
అదే మానవత్వం !

- పెనుమాక రాజశేఖర్
9493924634



# ఎంత ఎదిగినా......!

అడవి నుండి అంతరిక్షం వరకు
అనాగరికత నుండి నాగరికత వరకు
సైగలు నుండి భాషలు వరకు
క్షామం నుండి క్షేమం వరకు
బానిసత్వం నుండి స్వాతంత్ర్యం వరకు
పరపాలన నుండి స్వపరిపాలన  వరకు
నియంతృత్వం నుండి ప్రజాస్వామ్యం వరకు
సాగింది మానవ పరిణామం -

పెరిగింది మేధస్సు పరిమాణం
ఎన్నో అవకాశాలు
ఎన్నెన్నో ఆనందాలు
అందుకున్నాం
అభివృద్ధిని పొందుకున్నాం
ఆదర్శంగా జీవించాం
ఆదర్శంగా నిలిచాం

ఇంత జరిగినా
ఎంత ఎదిగినా
మనలో ఇంకా మరుగునపడనిది - మాసిపోనిది
అక్కడక్కడ కనిపిస్తున్నది
అప్పుడప్పుడు వినిపిస్తున్నది
అదే హింసావాదం !
మానవులలో అభద్రత భావం !

ఇది ఇలాగే కొనసాగితే
అభివృద్ధికి అడ్డుపడితే
ఇన్నాళ్ళు సాధించిన ప్రగతికి
మానవుల్ని పోషించిన జగతికి
ప్రమాదం వాటిల్లుతుంది
ప్రపంచమే కనుమరుగౌతుంది

అందుకే
మహాత్ముడిలా మానవత్వాన్ని ప్రకటిద్దాం
సాహితీమూర్తుల్లా సౌభ్రాతృత్వాన్ని చాటిచెబుదాం
శాంతిదూతల్లా స్నేహభావాన్ని వినిపిద్దాం
ప్రేమజ్యోతులను వెలిగిద్దాం
శాంతితత్వాన్ని బోధిద్దాం

- పెనుమాక రాజశేఖర్
9493924634



# శాంతిని అరువివ్వరూ.....!

ఉదరాంతరాళాల్లో అగ్నిగోళాల్లా
ఆకలి ఉవ్వెత్తున ఎగసి పడుతుంటే
బ్రతుకులోనే చస్తున్న పేదవాడికి
ఆపన్నహస్తాన్ని ఆకలి తీర్చడానికి
వాడి ఆకలి అశాంతిని
శాంతపరచడానికై శాంతి కావాలి
నాక్కొంచెం శాంతిని అరువివ్వరూ.. !

పేదసాదల బాధలగాథల
నిలయమైన రుద్రమేనిలో ?
రక్తానికే ప్రతిరూపమై
రయముగ ప్రవహిస్తున్న చెమట చెలమల్ని
ఫౌంటేన్‌లా చీర్స్ చెప్పి తాగుతుంటే
ఆ ధనాంధకార మదసంపన్నుణ్ణి
ఎలాగైనా ఎదిరించాలనే సంకల్పంతో
నిరంతరం కొలిమిలా మండే
ఉక్కునరాల చిక్కిన బక్కదేహాల
బుగబుగ జ్వాలాశాంతిని శాంతపరచే
శాంతిని నాక్కొంచెం అరువివ్వండి.. !

ప్రజల్ని పట్టి బంధనాలతో కట్టి
బ్రతుకుల్ని బూడిద చేస్తూ
బ్రతుకంతా వాడికి ఊడిగం చేయిస్తూ
రేపనే ప్రజ ఆశని
వాడి తప్పుడు లెక్కల్లో ఇవాళే జమవేస్తే

వారి బ్రతుకుల్ని సరిచేసుకుని
రాజకీయ పుష్పక విమానంలో విహరిస్తూ
ప్రజనెప్పుడూ పావుగా మారుస్తుంటే
వాడి రాజకీయ చెదరంగంలో
ఓటునే భస్మాసుర హస్తంలా ప్రజపై ప్రయోగించి
అశాంతనే గాఢాంధకారంలో మగ్గే ప్రజపై
శాంతిని కురిపించడానికైనా
నాకొంచెం శాంతిని అరువివ్వండి.. !

దేశమేదైనా ప్రాంతమేదైనా
ప్రపంచ విపణిలో బలిపశువులు మాత్రం
పేద ప్రజానీకమే కదా ?
బాధలెన్నున్నా బ్రతుకు నావ ఆపని
ప్రజ జీవితంలో శాంతిని కాజేసి
ప్రశాంతమైన వారి ప్రభాతాన్ని
పతనం చేసినా మీ దాహం తీరదా
బడుగుజీవుల అశాంతి బంధనాలు తెంచడానికి
నా కలం కాంక్షించిన శాంతిని
అరువుగానో, ఎరువుగానో తెచ్చి
వారి గుండెల నింపి
శాంతినే స్వప్నించే నేటి గాంధీలుగా మలచి
జీవిత పర్యంతమూ సాగే ఈ దోపిడీని
శాంతితోనే నిలువరిస్తాను
ప్రశాంతినే పలువరిస్తాను

– పెరుగుపల్లి బలరామ్
96766 36816

# మానవత్వం

మానవత్వమా ఎక్కడున్నావమ్మా
దిక్కుల ఆసాంతం వరకు వెదికి
వెక్కి వెక్కి బ్రతుకునీడుస్తున్నా
ఒక్కసారి కనిపించవేమమ్మా !
కడసారి చూపుకైనా కరుణించవమ్మా !

అజ్ఞాతవాసం చేస్తున్నావో
అవనినే విడిచి వెళ్ళిపోయావో
ఈ సందేహాలకు సాక్ష్యం
వర్తమాన సంఘటనలేనమ్మా
ఈ ఘటనలు రణాలే !
నిరంతరం బాధించే వ్రణాలే !

నవమాసాలు పెంచి పోషించిన కన్నవారిని
కడుపున పుట్టిన వాళ్లే
కర్రలతో ఎముకలు విరిగిందాకా
నెత్తురు కారిందాకా కొట్టి
కన్న రుణాన్ని తీర్చుకుంటున్నపుడు
నీకు రావాలనిపించలేదా ?

బిడ్డలే ఆస్తులని భావించి
భద్రంగా పెంచిన తల్లిదండ్రుల్ని
ఆస్తులంటే పొలాలు స్థలాలని
తల్లిదండ్రుల తలలు నరికి
పున్నామ నరకం తప్పిస్తున్నామన్నప్పుడు
నేనున్నానంటూ రావాలనిపించలేదా ?
కామవాంఛతో కళ్ళు మూసుకుపోయి
కన్నప్రేగును తుంచేసిన తల్లిని చూసి
నేను చేసిన తప్పేంటమ్మా అని
తుదిశ్వాసనే ప్రశ్నలా విడిచిన పసిమొగ్గకు
సమాధానంగానైనా రావాలనిపించలేదా?

ప్రియుడి ప్రేమలో మునిగిన సతి
తాళిని ఎదపై భారంగా తలచి -
భర్తని అడ్డుగా భావించి
ప్రేమతో విషాన్ని అందిస్తే
భరించే భర్తగా ప్రాణాన్ని విడిస్తే
ఖండించే ప్రశ్నగా రావాలనిపించలేదా ?

అంధులని అనాధలని చూడక
అభాగ్యుల జీవితాలతో ఆడుకుంటూ
నిత్యం నరకాన్ని చూపిస్తుంటే

గోడు వెళ్ళబోసే జాడ కోసం రోదిస్తుంటే
చీకటి పీడల్ని ఛేదించే వెల్గురేఖలా
నీకు రావాలనిపించలేదా ?

మూఢ విశ్వాసాలతో మసిలే మనిషి
చేతబడులనే అచేతనాలను నమ్మి
తోటిమనిషిని రాళ్ళతో కొట్టి
నిలువునా తగలేసినప్పుడైనా
నీకు రావాలనిపించలేదా ?

పరువు హత్యలని పిల్లల్ని చంపుతున్నారు
ప్రేమహత్యని ప్రేయసిపై పెట్రోలు పోస్తున్నారు
ఈ వికృత వింత వెగటు చేష్టలకడ్డుకట్టవై
నీ అజ్ఞాతవాసాన్ని వీడి
మనిషి మనిషిలో ప్రతిబింబించి
మనసు మనస్సుల్లో ప్రతిఫలించి
ఈ మర్త్యులని మనుషులుగా
మానవత్వపు ఋషులుగా మార్చి
మార్పు వైపు మరల్చు
మనిషితత్వాన్ని రగల్చు

- పెరుగుపల్లి బలరామ్
96766 36816

# శాంతికై ఆరాటం

శాంతి స్థాపన చేయడమంటే
ఎండమావుల్లోని నీటిని తోడుతున్నంత భారం
ఆధిపత్యానికి అణ్వాయుధాలు వత్తాసుపాడుతుంటే
శాంతికై ఆరాట పడటం
రాలిన ఆకులని తిరిగి చిగురుగా
చెట్లకు తొడగటమంత మూర్ఖత్వం

నిత్యం శాంతిని వర్షించాలని ఉన్నా
యుద్ధమేఘాలని అడ్డుకునే దారేది
హింసా మార్గం ప్రబలుతున్న చోట
శాంతి గొంతుకలు తెగిపడటం ఆశ్చర్యమేమీ కాదు

గమ్యం లేని యుద్ధాలు
ప్రతి క్షణం శాంతిని ప్రశ్నల ఊబిలోకి నెడుతున్నాయి
తెరకు అటూ ఇటూ నెలకొన్న వైరుధ్యాలు
ఉరికి వేలాడుతున్న శాంతిని
ఊయలలో ఊపుతున్నట్లు చూపవా

ఎవరిని నిందించగలం?
ఎవరిని ప్రశ్నించగలం?

ఆకలికి ఆదిమానవుడు ఎంచుకున్న మార్గాన్నా ?

పోరాటమే జీవనమనుగడైన జీవపరిణామాన్నా ?

కొత్తపుంతలు తొక్కుతున్న హింస
తన ఇనుప కౌగిట్లో
శాంతికి చరమగీతం పాడకముందే
ప్రపంచాన్ని ప్రశ్నించటం వదిలి
నన్ను నేను నిందించుకుంటున్న
శాంతి అంటే నాతోనే మొదలవ్వాలని.

- డా.జి.వెంకటలాల్
9100863135



# మానవత్వమా ! నువ్వెక్కడ ?

మానవత్వమా నువ్వెక్కడంటే
రాజకీయ కొట్లాటల మధ్య
పడున్న జీవచ్ఛవాల హృదయాల్లో వినమంటుంది !

కడుపున పుట్టిన వారే గెంటేస్తే
ఫుట్‌పాత్‌లపై సేదతీరే
ముసలి ముడతల్లో కొలుచుకోమంటుంది !

ప్రభుత్వ కార్యాలయాల బల్లల కింద
కాగితాల బేరసారాల్లో చూడమంటుంది!
కులమతాల కుమ్ములాటల్లో పారే
నెత్తుటి కాలువల్లో తోడుకోమంటుంది !

ఆర్థిక సంబంధాల ఉచ్చులో
నాటకమే జీవితమైన కపట స్నేహాలు
అవసరమో అవకాశమో అంతుపట్టని
కృత్రిమ ప్రేమల తికమక కాపురాలు!
వెన్నుల చీలిన సమూహాల నుండి
వ్యక్తులుగా మారిన అవ్యక్త వికారాలు
మోసపోతున్నామో మోసపుచ్చుతున్నామో తెలియక
ఒకరికొకరి కళ్ళల్లో కుటిలత్వాన్ని శోధించే మనసులు !

జగమంతా జనం

జనమంతా ధనం

ధనం బలం నిలపటానికి

దేనికి వెనకాడని వంచకులం !

తెలిసో, తెలియకో

చీకట్లు చిమ్ముకున్నాం

కత్తులు దూసుకున్నాం

పగా ప్రతీకారాల దుమ్మెత్తి పోసుకున్నాం !

ఏమైతేనేం... ఇన్నాళ్ళు

వికారంగా బతికాం బొంతపురుగుల్లా

మించిపోయిందేమి లేదు....ఇకనైనా

మానవత్వపు హరివిల్లు కప్పుకొని

సీతాకోక చిలుకలై మళ్ళీ పుడదాం.

- డా.జి.వెంకటలాల్

9100863135



# ఈ...... కొలతెంతో

ఏ తపము చేశావో
మనిషిగా జన్మించావు
ఏ జపము జపించావో
మానవత్వం మంట గలిపావు

మనిషిగా పుట్టినందుకు సంతోషమా !
మానవత్వం మరచినందుకు సంతాపమా !

మనిషి జన్మెత్తిన ఓ 'జీవి'
నీ మూలాధారం ఒక 'స్పాంజీ'★ అని తెలుసుకో.
స్పాంజీకి స్పందన వుంది
ఆ స్పందనలో జీవం తిరుగుతుంటే
నీ స్పందనలో స్వార్థం మరుగుతోంది
ఈ స్వార్థం కొలతెంతో తూచావా ?

జాగ్రత్త -
తూనికలు తిరగబడిపోతాయ్
చేతులు తగలబడిపోతాయ్

కళ్ళు మూసి చూడు -
మనగలిగే స్వార్థం - అవసరమే !
మనమే వుండాలనే స్వార్థం - ప్రమాదమే !

★ 4/12/2017 ఆంధ్రజ్యోతి దినపత్రికలో ప్రచురితం.

మనిషీ! మేలుకో!

మానవత్వం పెంచుకో!

ఆకాశానిది అంతులేని మానవత్వం
వసుంధరది వర్ణించలేని మానవత్వం
గాలిది అర్థం చేసుకోలేని మానవత్వం
నీటిది ఎవరూ తీర్చుకోలేని మానవత్వం
నిప్పుది జన్మసార్థకమయ్యే మానవత్వం

ప్రకృతిని అర్థం చేసుకో!

ప్రక్కవాళ్ళని కలుపుకుపో!

పసులకు నీళ్ళు పోస్తే పాలిస్తాయి!

మనిషికి ?

పక్షులకు మేత పెడితే వెంట నడుస్తాయి!

మనిషికి ?

మొక్కలకు పాదు చేస్తే నీడనిస్తాయి!

మనిషికి ?

మనిషికి అన్నీ సమకూరితే......
ఏమవుతున్నాడు ?

వంచకుడవుతున్నాడు

కంచెలు కడుతున్నాడు

మంచిని వినకూడదనుకొంటున్నాడు

మానవత్వం బారిన పడకూడదనుకొంటున్నాడు

పిచ్చ మనిషీ !
పచ్చనోటు మనిషీ !
అమ్మానాన్నల మానవత్వం లేకపోతే నీ 'అడ్రస్' ఎక్కడ ?
ప్రకృతి కరుణించకపోతే నీ జీవమెక్కడ ?
ప్రక్కవాడు ప్రసన్నత చూపకపోతే నీ స్థానమెక్కడ ?
సాటివాడి తోడు లేకపోతే అసలు నీ ఊసెక్కడ ?

మంచితనం అమ్మ మనసు !
మానవత్వం బ్రతుకు నిలుపు !

మంచితనం మనసుల్లో
మానవత్వం చేతల్లో
మనిషి బ్రతుకు
సుఖంగా...
సంతోషంగా......
సంతృప్తిగా........

– డా॥ ఎన్. వి. కృష్ణారావు
94902 18173



# షేక్ వెల్ బిఫోర్ యూజ్ ! (Shakewell before Use)

అందరూ జ్ఞానవంతులే !
ఆరోగ్య సూత్రాలు పాటిస్తున్నారు

రెండుపూట్లా నడకలు
రెండు పూట్లే తిళ్ళూ

వాటర్‌కి కొలతలు
టాబ్లెట్‌కి విడతలు

గుండె భద్రతకు ఎన్ని పాట్లో
కొవ్వు కరగడానికి ఎన్ని ఫీట్లో

అసలు జ్ఞానం ఆవిరవుతోంది
అందించాల్సిన చేయి దూరమవుతోంది

ప్రతి ప్రకటనలో పత్రహరితం
పల్లెల్లో కనిపించదు ఏ హరితం
రైతు బతుక్కి లేదు ఏ భరణం
అతనికి శరణం - తప్పని మరణం

మానవత్వానికి -
దిక్కైన చిరునామా - రైతే గదా !
దిక్కులేని చిరునామా - రైతే గదా !

మనిషి ఆరోగ్యం కోసం -
'టానిక్కు'కు షేక్‌వెల్ బిఫోర్ యూజ్ !
ఆనందమయ సమాజం కోసం
'మనసు'ను షేక్‌వెల్ బిఫోర్ చేయాలి !

ఆ 'షేక్'
మనసుని కదిలిస్తుంది, అదిలిస్తుంది

తేడా గమనించావా ?
ఆ మనసు
మనిషిని స్పర్శిస్తుంది
మనసును స్పందిస్తుంది
మానవత్వాన్ని నినదిస్తుంది
ఆ మానవతా మనిషే
మహోన్నతుడని చాటుతుంది

చూడు -
'షేక్ వెల్ బిఫోర్ యూజ్'
ఎంత యూజో !
ఆరోగ్యానికే కాదు !
ఆహ్లాద ప్రపంచానికి !

- డా॥ ఎన్. వి. కృష్ణారావు
94902 18173



# మనం - జనం

కంటి నిద్రకు
ఎన్ని పాట్లో లెక్కింపవచ్చు
కానీ.......
బతుకుతెరువుకి ?
ఎన్ని పాట్లో లెక్కించగలమా ?
పొట్టకూటికి ?
ఎన్ని పోట్లో గుర్తించగలమా ?

మానవత్వం సహకరిస్తే సాపాటు
అమానవీయత అగుపిస్తే గ్రహపాటు
సాపాటు, గ్రహపాటు
ఎంత గాఢ స్నేహితులో !
రైలు పట్టాలే !
పక్కపక్కనే ఉన్నా
ఎప్పుడూ కలుసుకోవు
అతకడం అంతకన్నా చేతకాదు

పేదరికంతో బాధపడవచ్చు
మధ్యతరగతిగా జీవించవచ్చు
ధనవంతుడిగా దర్జా చూపించవచ్చు

కష్టాలను కన్నీళ్ళతో దాటవచ్చు
బాధలను ఓర్పుతో భరించవచ్చు
సుఖాలను సున్నితంగా అనుభవించవచ్చు
ఆనందాలను మనసుతో మురియవచ్చు

మరి - మానవత్వాన్ని...... ! ?
మానవత్వానికి
ఆత్మే అనుసంధానం
మంచితనానికి
చేసిన పనే తార్కాణం

మంచితనం
మనిషిని బాగు చేస్తుంది
మానవత్వం
మరో మనిషికి బతుకునిస్తుంది

మానవత్వమంటే -
నువ్వూ, నేనూ కలిసి మనం !
వారూ, వీరూ కలిసి జనం !

మానవత్వం కలిగి వుండటం
మనిషికి వరం !
అది జన్మజన్మలకు
నిన్ను చూపించే దర్పణం !

మంచితనం
వికసించాలి మనం జనంలో !
మానవత్వం
వెలగాలి ప్రపంచ పటంలో !

- డా॥ ఎన్. వి. కృష్ణారావు
94902 18173



# విన్నో - లాసో ! (WIN - LOSE)

సరుకుతున్నా అరుపులు లేవు
కోస్తున్నా కేకలు రావు
మనిషికి
ప్రకృతి ప్రసాదం !
సహనంలో
రెండో స్థానం !

చెట్టును చూసి నేర్చుకో !
ఎదగాలన్నా
ఒదగాలన్నా
ఎదుటివారికి
ఏమివ్వాలన్నా ?
దానికదే సాటి
మరేదీ లేదు పోటీ !

విత్తు నాటితే మొక్క
మొక్క పెరిగితే చెట్టు
చెట్టు పెరిగితే వనం
వనంలోకి జనం
ఇక ఆగదు ఖననం !

మనిషికిది
విన్నో, లాసో
గుర్తించేలోపే క్లోజో !

- డా॥ ఎన్. వి. కృష్ణారావు
94902 18173

# రాసిందంతా.....! బ్రతికిందంతా.....!

మనిషి పుట్టుకే ప్రభంజనం
మనిషి కలయిక మహాప్రభంజనం
కలవాలంటే బతకాలి
బతకాలంటే ఎన్ని కావాలో !

కళ్ళు - కాళ్ళు
గుండె - నెత్తురు
కాలేయం - క్లోమం
ఊపిరితిత్తులు - జీర్ణాశయం
ఒకటేమిటి -
జీవముండటానికి
అవసరమైనవన్నీ కావాలి

మరి - జీవితానికేం కావాలి ?
తోడా - గూడా
డబ్బా - డాబా
ఉద్యోగమా - పదవా
నవ్వా - నడతా
మనసా - మమతా
ఇవన్నీ ఉంటే -
'మనిషి'గా గుర్తించబడతాడు

జీవితమంటే - మనిషిగా గుర్తింపు కాదు

జీవితమంటే - ఒక 'జీవి'గా జీవించడం కాదు

జీవితమంటే - భూమిని చుట్టెయ్యడం కాదు

జీవితమంటే - సముద్రాన్ని ఒడిసి పట్టెయ్యడం కాదు

జీవితమంటే........ !

జీవితాన్ని పంచడం !

మానవత్వాన్ని చూపడం !

రాసిందంతా కవిత్వం కాదు

బ్రతికిందంతా జీవితం కాదు

రాసిన దాన్లో హృదయాన్ని స్పర్శించిందే కవిత్వం !

బ్రతికిన దాన్లో గుండెతడిని ఆవిష్కరించిందే జీవితం !

ఆ గుండె తడే మానవత్వం

ఆ మానవత్వమే

కావాలి మనిషి తత్వం

అదే ప్రపంచానికి బ్రతుకుధనం !

**'మానవత్వానికి లేదు ఏ కొలమానం ! '**

- డా॥ ఎన్. వి. కృష్ణారావు

94902 18173

# అడవి - నగరం

అడవి, నగరం

ఏమిచ్చాయి ?

అడవి నగరాన్నిచ్చింది

నగరం - అడవిని హత్య చేసింది

వృక్షం ఒక వరం

మానవజాతికే కాదు

ప్రతిప్రాణికీ దివ్యౌషధం !

మానవత్వానికి -

స్పష్టమైన ఆకారం ! అవకాశం !

మానవ వికృతికి

మాయమవుతున్న ఆహారం ! ఆహ్లాదం !

'చెట్టు మానవతకు దారి చూపే మెట్టు' !

- డా॥ ఎన్. వి. కృష్ణారావు

94902 18173



"మానవతా కవులు" కవితా సంకలనం

# కర్మ కాదు క్రియ

'సెక్స్ రోబో'ను సృష్టించింది మానవ మేథస్సు
'మానవత్వం' మాట మరిచింది మనిషి మనస్సు

మనిషి మరిచిన మానవత్వాన్ని చాటుదాం
తిరిగి మనిషిలో దానిని నాటుదాం

మానవత్వపు నిర్వచనాల ప్రమిదపై
అనంత జ్యోతివై వెలుగుతున్నావు

శాంతంటే
తెల్లజెండానో
శ్వేత కపోతమో
రాట్నం వడకటమో కాదు

అసూయను అణచాలి- ఆప్యాయతను అందించాలి
గర్వాన్ని బంధించాలి - గౌరవాన్ని కలిగించాలి

మానవత్వపు ఋషులుగా మార్చి
మార్పు వైపు మరల్చు
మనిషి తత్వాన్ని రగుల్చు

శాంతి స్థాపన చేయడమంటే
ఎండమావుల్లోని నీటిని తోడుతున్నంత భారం

మనగలిగే స్వార్థం - అవసరమే
మనమే ఉండాలనే స్వార్థం - ప్రమాదమే

మాతృత్వం మృగ్యమాయె
భ్రాతృత్వం పారిపోయె
ఔదార్యం ఓడిపోయె

రాసిందంతా కవిత్వం కాదు
బ్రతికిందంతా జీవితం కాదు

సంపాదకులు
డా॥ ఎన్.వి.కృష్ణారావు